# సిరి ముక్క మొగ్గ

548

తాడి వెంకట కృష్ణారావు



ప్రచురణ :

శశిశ్రీ పబ్లికేషన్స్

హుమాయూన్ నగర్, హైదరాబాద్ – 28

సిరి చుక్క మొగ్గ (గేయ సంకలనం)

రచన: తాడి వెంకట కృష్ణారావు

మొదటి ముద్రణ:

ప్రతులు 1000

నవంబరు 1973

ముఖ చిత్రాలంకరణ:

రామారావ్, మద్రాసు-17

ముద్రణ:

లలితా ప్రెస్, హైదరాబాదు-4

ముఖపత్ర ముద్రణ:

డాల్టన్ ప్రెస్, హైదరాబాదు-1



వెల: నాలుగు రూపాయలు

ప్రతులకు:

1. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
   రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-500003.

2. శశిశ్రీ పబ్లికేషన్స్, 10-3-192/2
   హుమాయూన్ నగర్, హైదరాబాద్-500028.

# సమర్పణ



కన్నకొడుకు కన్నా మిన్నగా చూస్తున్న
అమృత హృదయులు, ప్రేమ స్వరూపులు
చిన్నాన్న శ్రీ మన్నెపురి శ్రీరాం
పిన్ని శ్రీమతి గారి
చరణ సన్నిధిని అర్పించిన కవితా కుసుమం
ఈ సిరి మొక్క మొగ్గ.

తాడి వెంకట కృష్ణారావు

# తాడి వెంకట కృష్ణారావు



కృష్ణా జిల్లా 'పెరికీడు' ఈయన స్వగ్రామం. 1937 జనవరి 13వ తేదీ పశ్చిమ గోదావరి జిల్లా 'సత్యవోలు'లో మాతామహుల ఇంట జన్మించారు. సాహిత్య సౌరభాలు గుబాళించే నూజివీడు సంస్థానంలో బాల్యం గడిపారు. తల్లి రామమ్మగారి వద్ద రామాయణ భారత కథలు తెలుసుకున్నారు. తండ్రి లక్ష్మయ్యగారి వద్ద సాహితీ శుశ్రూష చేశారు. జీవితాన్ని రుజువర్తనలో, క్రమశిక్షణతో సాగించటం ఈయన తల్లిదండ్రులు చిన్ననాట నేర్పిన విద్య. ఏలూరు, భీమవరం కళాశాలలలో చదివి పట్టభద్రులయ్యారు. విద్యార్థిగా వున్నప్పుడే వీరి కవితా సంకలనం 'ఉత్సవ కుసుమాంజలి' విజ్ఞుల ప్రశంస లందుకున్నది.

వెంకటకృష్ణారావు కథ, కవిత, నవల, నాటిక మొదలైన సాహితీ ప్రక్రియలలో సిద్ధహస్తులు. బాలసాహిత్యంలో ప్రత్యేక కృషి చేశారు. ఈయన మంచి భావుకుడు. దేశాభిమాని. స్నేహశీలి. శబ్దమాధురి, రసస్వరూపం ఎరిగిన కవి.

జంటనగరాలలోని పెక్కు సాహిత్య సాంస్కృతిక సంస్థలతో ఈయనకు సన్నిహిత సంబంధం వుంది.

ప్రస్తుతం వీరు హైదరాబాదులో ఆంధ్రప్రదేశ ప్రభుత్వ అనువాదశాఖలో పనిచేస్తున్నారు.

# మనవి

ఉత్తమ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు అందించాలనే మహాశయంతో ఈ ప్రచురణ సంస్థను ప్రారంభించాం. మా తొలికుసుమంగా ఈ "సిరి మల్లె మొగ్గ"ను సమర్పించే అవకాశాన్ని మాకు కలిగించిన ప్రముఖ కవులు శ్రీ దాశె వెంకటకృష్ణారావు గారికి మా హృదయపూర్వక అభివందనాలు తెల్పు కుంటున్నాము.

తమ కలం పేరును మా సంస్థకు వినియోగించడానికి అనుమతించడం వారి సహృదయతకు నిదర్శనం.

సర్వాంగ సుందరంగా ముఖచిత్రాలను రచించిన ప్రసిద్ధ చిత్రకారులు, సినీ పబ్లిసిటీ ఆర్టిస్టు శ్రీ రామారావ్ (మద్రాసు) గారికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ప్రచురణలో మాతో సహకరించిన మిత్రులు శ్రీయుతులు గోవిందరాజు రామకృష్ణారావు, తిరువీధి రమణయ్య, దేశిరాజు వెంకటకృష్ణారావు, తాడి రంగవరప్రసాద్ ప్రభృతులకు మా హార్దికాభివందనాలు.

ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రించిన లలితా ప్రెస్ అధిపతులు మహా పండితులు శ్రీ చర్ల గణపతిశాస్త్రి గారికి, ముఖపత్రం ముద్రించిన డాల్టన్ ప్రెస్ అధిపతులు సౌజన్యమూర్తులు శ్రీ ఎన్. రంగారావు గారికి మా కృతజ్ఞతలు.

సాహిత్యాభిమానులైన తెలుగు పాఠకులు మా ఈ తొలి ప్రచురణను ఆదరించి మా కృషికి చేయూత నివ్వగలరని విశ్వసిస్తున్నాం.

శశిశ్రీ పబ్లికేషన్స్
హుమాయూన్‌నగర్, హైదరాబాద్-28.

# వినయాంజలి

ఈ "సిరి చుక్క మొగ్గ" నా మనసులో మోసులెత్తి సరిగా పన్నెండు సంవత్సరాలైంది. 1961 నవంబరు చివరినాటికి ముప్పయి గేయాలతో రచన పూర్తయింది. దానినే వెలుగులోకి తేవాలని ప్రయత్నించాను కాని ఫలించలేదు. తరువాత 1965-66 మధ్య పాతిక పైగా గేయాలు ఆంధ్ర ప్రభ దినపత్రికలో ప్రచురిత మయ్యాయి. ఇతర ప్రతికలలోకూడా నా గేయాలు చాలా వచ్చాయి.

వీటిలో అరవై గేయాలు జాగ్రత్తగా ఎన్నికచేసి పుస్తక రూపంలో ప్రకటింపజేయటానికి ఈసారి మరో ప్రయత్నం చేశాను. ప్రచురణ కర్తలు నా రచనలపట్ల ఉత్సాహం చూపటంవల్ల ఈ పుస్తకం వెలుగులోకి రాగలిగింది. ప్రచురణ కర్తలకు నా కలం పేరు "శశిశ్రీ" పై కూడా మిక్కిలి అభిమానం ఏర్పడింది. తమ సంస్థకు "శశిశ్రీ పబ్లికేషన్స్" అని పెట్టుకుంటామన్నారు. సమ్మతించాను. శశిశ్రీ పబ్లికేషన్స్ వారికి నా కృతజ్ఞతలు.

నా రచనలను తమ పత్రికలలో ప్రచురించి నన్ను ప్రోత్సహించిన ఆంధ్ర ప్రభ, ఆంధ్ర జనత, కృష్ణా పత్రిక, బహుజన, శ్రీమతి, జయశ్రీ, విశ్వరచన, ఆటపాటలు పత్రికా సంపాదకులకు నా ధన్యవాదాలు.

ఈ కవితా సంపుటికి తమ ఆశీస్సులు అందజేసిన ప్రసిద్ధ కవి డా॥ సి. నారాయణరెడ్డి గారికి నా వినయాంజలులు.

ఆదినుంచీ నా సాహిత్య కృషికి మార్గదర్శకులుగా, చేదోడు వాదోడుగా ఉంటూవస్తున్న పూజ్యపాదులు మహాకవి, కళాప్రపూర్ణ పద్మశ్రీ బోయి భీమన్న గారికి నాకృతజ్ఞతాంజలులు

పుష్ప నిలయం,

భాగ్యనగరం.

తాడి వెంకట కృష్ణారావు

30-11-1973.

డా॥ సి. నారాయణరెడ్డి

# బలే పేరు

"సిరి చుక్క మొగ్గ" ఇది ఈ పుస్తకం పేరు. పుస్తకం పేరులోనే వస్తువును సూచించాడు రచయిత. "సిరి చుక్క మొగ్గ" ఏమిటిది? ఈ తరంలో మాయమైన పదబంధాలివి. ఆ రోజుల్లో ఉదయం మొట్టమొదట బడికి వెళ్ళిన విద్యార్థిది సిరి. అంటే అతడు శ్రీకారం చుట్టాడన్నమాట. అంటే-అంటే ఈనాటి మాటల్లో అంటే-ఆ రోజు హాజరుపట్టీలో అతడు ఫస్ట్ అన్నమాట. చుక్క అంటే సెకండ్ అన్నమాట. మొగ్గ అంటే థర్డ్ అన్నమాట. సిరి-చుక్క-మొగ్గ ఫస్ట్-సెకండ్-థర్డ్. ఇదీ దీని కథ. ఈ సంప్రదాయం ఎరిగిన రచయిత కాబట్టే వెంకట కృష్ణారావు గారు తమ బాల గీతావళికి ఈ పేరు పెట్టారు. ఆ రకంగా ఔచిత్యానికి తురాయి పెట్టారు.

తాను వ్రాస్తున్నది పిల్లల పాటలైనా ఈ రచయిత కవితా కణాలను పుష్కలంగా అందించారు. మచ్చుకు చూపమంటారా?

> ఎర్ర పువ్వు సూర్యుడంట
> తెల్ల పువ్వు చంద్రుడంట
> ఆకసమే చెట్టేమో?
> పూలు రెండు పూచెనేమో?

ఆకాశాన్ని చెట్టుగా ఊహించడం, సూర్యచంద్రులను పూలుగా భావించడం, ఈ రచయిత కవితాత్మకు నిదర్శనం.

మామూలుగా పిల్లల పాటల్లో కనిపించని ప్రగతి దృక్పథాన్ని ఈ రచయిత ప్రవేశపెట్టాడు. "ఏమంటావే అమ్మా" అనే గీతంలో ఆ భావం రూపు దిద్దుకుంది.

"అందమైన పెద్ద మేడ
అమ్మ మనకి ఉందిగదే
అందర్నీ రమ్మంటూ
అందర్నీ ఉండమనవే."

చెట్ల క్రింద పడిఉన్న దిక్కులేని వారిని చూసి పసివాడు పొందే ఆవేదన ఈ పాటలో పల్లవించింది. అయితే ఇది ప్రాథమికంగా ఆ పసివాని జాలిగుండెను సూచించేదైనా లోతుల్లోకి వెళితే రచయిత ఉద్దేశించిన సామ్యవాద సిద్ధాంతం కూడా గోచరింపకపోదు.

ముందే అన్నాను నేను, మచ్చుకు చూపిస్తున్నానని. అదేదో పూర్తయింది. ఇక చవి చూడవలసింది పాఠకులు. ఈ పాటలను పాడి ఆడవలసింది బాలికా బాలకులు.

ఇట్లు
**సి. నారాయణరెడ్డి**
10-11-73.

త్రివేణి
హైదరాబాదు

మహాకవి
కళాప్రపూర్ణ
పద్మశ్రీ
జాషువ భీమన్న

# ఉత్తము ఆదర్శం

యువ కవులేకాని నవ కవులు లేని యుగమిది. ఈ రోజుల్లో కవిత వ్రాస్తున్నంత మంది యువకులు ఇంతకు ముందు ఎన్నడూ వుండి వుండ రనుకో వచ్చు. అయితే కవితలో మాత్రం నవత కనిపించడం లేదు.

ఉడుకుతనం, దుడుకుతనం, తిట్లు, వట్లు, మాటల ఫీట్లు, రాజకీయ విమర్శలు, వర్గ నినాదాలు— మాటన్ని బోల్తాకొట్టించి, నవ్వు పుట్టించి, చప్పట్లు కొట్టించుకోడాలు, పూర్వ కవుల నుంచీ, జానపద సాహిత్యంనుంచీ భావాలు, వాక్యాలు కూడా కొట్టేసి అక్కడక్కడ మసిపూసి, స్వంతం చేసుకొని కీర్తి గడించడాలు— ఇదీ ఈనాటి ఆధునిక కవిత స్వరూపం. సినిమాలు, రేడియోలు, పత్రికలు వంటి ప్రచారసాధనాలను కైవశం చేసుకొని తమ గుప్పిట్లో పెట్టుకొన్న వాళ్లు తదితరులకంటే అత్యధికంగా కీర్తిప్రతిష్ఠలను ఆర్జించటం జరుగుతున్నది. తదితరులకు అట్టివాళ్లే కవితలో ఆదర్శ కవు లవుతున్నారు. ఇదీ ఈనాటి ఆధునిక కవితా రంగాన్ని పట్టుకొని పీడిస్తున్న జాడ్యం.

కవిత వ్రాయడానికి కొంచెం ఆలోచన కావాలి అన్న ఆలోచనే ఇప్పుడు కవిత వ్రాస్తున్న వా రెవరికీ లేదు. అసలు ప్రతిభే లేదు. అది వున్నవాళ్లు కూడా వ్యుత్పన్నతను పొందడంలేదు. కొంచెం భాషకోస మైనా పూర్వగ్రంధాలు చదువుదాం, వివిధ రంగాలకు సంబంధించిన కనీస విజ్ఞానాన్నైనా సంపాదిద్దాం, ప్రకృతిని, జీవనైజాన్ని పరిశీలిద్దాం, ఉచితానుచితాలను గ్రహిద్దాం, గతాన్ని పునాదిగా చేసుకొని వర్తమానం సామగ్రిగా, భవిష్యత్తును ఇతోధిక సముజ్వలంగా నిర్మిద్దాం— అనే ఆలోచనే లే దెవరికీ. ఇక అందుకు కృషి ఎలావస్తుంది? ప్రయత్నమైనా ఎలా జరుగుతుంది? ఇదంతా నేను చిరకాలంగా చెపుతూ వస్తున్నట్టిదే. అనేకచోట్ల వ్రాసినట్టిదే. నా హెచ్చరికలన్నీ "అంధేందూదయముల్, మహాబధిర శంఖారావముల్. . ." వలే ఇప్పటికీ వ్యర్థమైపోతున్నట్టివే.

నిజానికి ఇదే ఈ యుగధర్మం. బ్రతుకుతెరువును వెతుక్కోవడమే ప్రధానలక్ష్యంగా పరిణమించిన ఈనాడు అన్ని విద్యలతోపాటు కవిత వ్రాయడం అనేది కూడా ఒక బ్రతుకుతెరువు సాధనంగా మారింది. వాస్తవానికి చాలా ముఖ్య సాధనంగా కూడా అవుతూవుంది. ప్రచారం, పేరు, గౌరవం, సత్కారాలు, తద్వారా ఆర్థికలాభం. హోదాగలవారి పరిచయం, పదవులలోకి ప్రవేశం వగైరా కవిత వ్రాయడం మూలకంగానే సులువుగా సాధ్యమవుతున్నాయి. అందువల్ల రైల్వే స్టేషన్లలో భోజనసదుపాయాలవలే నేటి కవిత ఉడికీ ఉడకని మెతుకులు కాక తప్పడంలేదు. అందుకు నావంటి శుద్ధ కవితావాదులు బాధపడి ప్రయోజనం లేదు.

పరిస్థితి ఇలావున్నప్పుడు- కవిత వ్రాసి ప్రచారం తెచ్చుకోవాలనే ఆత్రంతో యువలోకం తొడతొక్కిడిగా తొక్కిసలాడుతు న్నప్పుడు అందులో చేరలేక, చేతులు ముడుచుకు కూర్చోనూలేక బాధపడే కొందరు మధ్యతరగతి యువకులు గండిపడి కొట్టుకు పోతున్న వర్తమానం మీద గతానికి, భవిష్యత్తుకూ వంతెనలు కడుతున్నారు. అలాంటివారిలో శ్రీ తాడి వెంకటకృష్ణారావు గారు ఒకరు.

శ్రీ తాడి వెంకటకృష్ణారావుగారు నాకు చాలా ప్రియమైన చిరకాల మిత్రుడు. ఈయన సౌమ్య స్వభావుడు. స్నేహపాత్రుడు. రూపువాల్చిన సోషలిజం అన్నంత దయాశీలుడు. మానవ బాధను ఏమాత్రమూ సహించలేని పసిహృదయం ఆయనది. బహుశా అందుకేనేమో పసిహృదయాల పెంపుకోసం "సిరి చుక్క మొగ్గ"ను నిర్మించగలిగా రాయన.

మొట్టమొదట తన వ్రాతప్రతులు, తరువాత తాను పరిచయమయ్యారు నాకు. అంటే సందెడు వ్రాత ప్రతులతో ఆయన నా దగ్గరకు వచ్చారు. నేను చూసింది ముందు ఆయన కృతులను, తరువాత ఆయనను. ఎన్నో విషయాల మీద ఎంతో సాహిత్యాన్ని సృష్టించా డాయన. ఎందుకో అవంతా అలానే వుండిపోగా— దృష్టిని చదువు సంధ్యలు కొరవడుతున్న నేటి బాలలపైకి మళ్లించి- ఇప్పుడు ఈ 'సిరి చుక్క మొగ్గ' గేయ సంపుటిని బైటికి తీసుకొ వచ్చారు- ఉత్తమ ఆదర్శం. మంచి ప్రయత్నం. చక్కని కృషి.

మనకు బాల సాహిత్యం చాలా తక్కువ. ఇప్పుడిప్పుడే అది మొగ్గ తొడుగుతూ వుంది. కృష్ణారావుగారి భాషలో చెప్పాలంటే సిరి చుక్క దా

మొగ్గ తొడుగుతూ వున్నదన్న మాట. మా చిన్నప్పుడు మేం సిరి చుక్క దెబ్బ అనేవాళ్లం. మా టీచరు— బడికి మొట్టమొదట వచ్చిన పిల్లవాడికి చేతిలో బెత్తంతో శ్రీ అక్షరం వ్రాసి, రెండవ వాడి చేతిలో బెత్తం కొసతో చుక్క పెట్టినట్లుగా నొక్కి—మూడవ వాడి అరచేతిమీద ఒక చిన్న దెబ్బ కొట్టేవారు. బడికి వచ్చిన మొదటి ముగ్గురికి మాత్రమే ఆ ప్రత్యేకత. ఆ తరువాత వచ్చే వాళ్లకు ఆలస్యాన్ని బట్టి శిక్షలు విధించేవారు. ప్రతిరోజూ అలాగే జరిగేవి. అందుకే బడికి ఆలస్యంగా వెళ్లడానికి పిల్లలు భయపడేవారు. అవమానంగా కూడా ఫీలయ్యేవాళ్లు. పోటీలు పడి సకాలానికి బడికి చేరుకొనే వాళ్లు. బహుశా అందుకే ఆకాలంలో విద్యార్థుల్లో అంతటి గొప్ప క్రమశిక్షణ వుండేది. చదువు పంటబట్టేది. ఈనాటి ఎం. ఏ. వాడి కంటే ఆనాటి మెట్రిక్‌వాడే ఎన్నో రెట్లు విద్వాంసుడుగా వుండే వాడు. దెబ్బను తీసేసి దానికి బదులు మొగ్గను పెట్టటంలో ఈ రచయిత చూపిన ఔచిత్యం, ప్రగతిశీలత, ధార్మిక విజ్ఞత, నిజంగా అభినందనీయాలు.

చదవాలి, వినాలి, చూడాలి, గ్రహించాలి. ఇదే విద్య అంటాడీయన. అందుకు లక్ష్యంగా ఈ గేయ రచన చేశాడు. ఈ సంపుటిలో అరవై శీర్షికలున్నై. మొత్తంమీద ఒక్కొక్క గేయం ఒక్కొక్క విషయంపై అల్లబడింది. అరవై విషయాలను పరిశీలించి చూస్తే నాకు కనిపించిందేమిటంటే— బాలలు ఈ ఒక్క పుస్తకాన్ని చదివి, విషయగ్రహణం చేస్తేచాలు అందరూ బాలవిద్వాంసులై పోగలరు అని. ఈనాడు పాఠశాలలలో చెప్పబడుతున్న ఆధునిక విజ్ఞాన విషయాలెన్నో ఈ సంపుటిలో గేయీకరించబడినై. అంటే మాత్రాబద్ధమైన ఛందస్సులలో పాటకు వీలుగా కూర్చబడినై. ఈ గేయాలను పాడుతూ రకరకాల నాట్యాలను చేయవచ్చుకూడా. సాహిత్యాన్ని ప్రయోజనకరమైన సాధనంగా వాడటం అంటే యిది. ప్రజాసాహిత్యం అంటే యిది. అర్థంలేని అయోమయపు నినాదాలు చేయడం, ప్రజాసాహిత్యం కాబోదు. ఒక స్పష్టమైన హేతుబద్ధమైన వస్తువును తేలిక పదాలతో సాహిత్యంలోకి మలిచి భావిపౌరులైన బాలల కందించడం ఎంతటి మహాకవు లనబడే వారికంటే కూడా ఉత్తమ సాహితీ కృషి. ఈ కృషిలో సాహితీకృషిపండిత బిరుదాన్ని అందుకోవాలని శ్రీ తాడి వెంకట కృష్ణారావుగారిని ఆశీర్వదిస్తున్నాను.

బోయి భీమన్న

20-11-73

హిమానీ

భాగ్యనగరు

# విషయ సూచిక

# సిరి చుక్క మొగ్గ

బడికి పోతానమ్మ బడికి పోతాను
బడిలోన మాష్టారు మాకుంచి వారు
పాట లెన్నో వారు పాడించుతారె
ఆట లెన్నో వారు ఆడించుతారె.

తల దువ్వవే అమ్మ తొందరగ నీవు
ఆలస్య మాయెనే అమ్మ నా కిపుడు
చద్ది అన్నం పెట్టు చకచకా పోవాలి
బడిగంట కొడతారు పరుగెత్తి పోవాలి.

అందరికి ముందుగా బడికి పోవాలి
సిరి చుక్క మొగ్గలో సిరినినే నవ్వాలి
త్వరగ పోవాలమ్మ త్వరగ పోవాలి
నన్ను మేష్టారెంతొ మెచ్చుకుంటారె.

మాష్టారు మమ్మెపుడు కొట్టరే అమ్మా
మంచి కథలను చెప్పి మురపించుతారె
చక్కగా చదవమని చెపుతారు వారు
శుచి శుభ్రతలు మాకు నేర్పుతుంటారు.

గడ్డి పరక లన్ని వెంటిగా మార్చితే
బలమైన ఏనుగును ఆపునంటారు
ఐకమత్యమె బలం కథ చెప్పినారు
అందరిని ఒకటిగా వుండమన్నారు.

# తెలుగు బాలలం
# వెలుగు బాలలం

తెలుగు బాలలం వెలుగు బాలలం
భరతమాత బంగారు బాలలం

చదువూ సంధ్యా భక్తీ శ్రద్ధా
వినయ విధేయత చూపిస్తాం
అమ్మా నాన్నా గురువూ దైవం
పెద్దలందరిని పూజిస్తాం.

దేశ దేశాల దేశ కీర్తినీ
మారు మోగగా మోయిస్తాం.
దశదిశ లందున తల్లి పేరునూ
తర తరాలకూ నిలబెడతాం.

# బడి పిల్లల వందనం

వందనం... వందనం
తెలుగు తల్లీ! వందనం
అందుకోనవే ముందుగా
బడి పిల్లల వందనం.

రోజు నిన్ను తలుస్తూ
పూజలు చేస్తాములే
ఎల్లకాలమందు మమ్ము
చల్లగ కాపాడవే.

నీ వంటే మాకు భక్తి
నిన్ను మరచివుండ మెపుడు
నీ వెంటే వుందు మమ్మ
నీ కీర్తిని పాడెదం.

కవులం మేమేనమ్మా
గాయకులం మేమమ్మా
చిత్రకారులం మేమే
శిల్పులమూ మేమమ్మా.

నీ సేవలు చేతుమమ్మ
నీ పిల్లల మేమమ్మా
నీ కీర్తిని నిలుపుటకై
మేము పుట్టినామమ్మా.

# చందమామలం

పిల్లలం... పిల్లలం
అందమైన పిల్లలం
మాంచూంమరార్మా తెరుగని
మంచి మంచి పిల్లలం.

అల్లరి చేయం, కల్లలుపల్కం
అమ్మా నాన్నలు ఆనందించగ
ఎల్ల వేళలా వెన్నెల పల్కులు
చల్లే చక్కని చందమామలం.

# రంగు రంగులా బొంగర మదిగో...

రంగు రంగులా బొంగర మదిగో!
రింగు రింగునా తిరుగుతున్నదీ
ఛెంగున దారం త్రిప్పి విసరగా
ఖంగున వాలి తిరుగుతున్నది.

మనం తిరిగిన, కళ్లు తిరుగునూ
బొంగర మొంతో తిరిగిన గానీ
కళ్లు తిరగవూ కాళ్లు లాగవు
ఏమి చోద్యమో! ఎంత చోద్యమో !

రంగుల రాట్నం రమ్మన్నట్లుగ
హంగులు చూపి అలరిస్తున్నది.
భూమి మాదిరీ చుట్టు తిరుగుతూ
బాలల ఆశలు పండిస్తున్నది.

# రావె రావే పాప
# రతనాల పాప

చిన్నారి ఓ పాప! చిట్టి మా పాప!
ముద్దు గొలిపే పాప! ముచ్చట్ల పాప!
పాల బుగ్గల పాప! బంగారు పాప!
రావె రావే పాప! రతనాల పాప!

బడిలోన ఎన్నెన్నొ, బొమ్మ లున్నాయి
అన్ని చూతువు రావొ, అందాల బాల!
పాటలను నేర్పుతా, ఆటలను నేర్పుతా
మంచి కథలను నీకు, ఎంచక్క చెప్పుతా.

రావోయి రావోయి, బడికి రావోయి
బడిలోన ఎందరో, బాల లున్నారు
అందరూ జత కూడి, ఆడుకోవచ్చు
అందరూ జత కూడి, పాడుకోవచ్చు.

# ఏ లోకం వెళ్ళినావు ?

నెహ్రూ మామయ్యా నీవు !
ఎంత పిలిచినా పలుకవు !
ఏమి తప్పు చేసినాను ?
ఏమి ముప్పు తెచ్చినాను ?

అమ్మ నడిగి నాన్న నడిగి
అలసి పోయినాను మామ !
అసలె నీవు రావనుచు
అబద్ధాలు చెప్పినారు .

ఎన్నిమార్లొ విమానంలో
ఎన్నో దేశాలు తిరిగి
మరలి వచ్చి నన్ను నీవు
మరిమరి ముద్దాడినావు .

కాళ్ళ నడక వెళ్ళినావ ?
ముళ్ళబాట వెళ్ళినావ ?
నెలలు నెలలు నీ వెచ్చట
నిలిచి పోయినావు మామ !

ఏ లోకం వెళ్ళినావు ?
మా లోకం ఇంకరావ ?
నీవులేని ఈ లోకం
నా కెందుకు ఓ మామ !

# అచ్చులతో ముచ్చటలు...

అమ్మ నీకు మరి దైవంరా
ఆదరించి నిను చూచునురా
ఇప్పుడు అప్పుడు ఎప్పుడైననూ
ఈల వేసినా గోల చేసినా
ఉరక లేసినా పరుగు తీసినా
ఊరడించి ముద్దాడునురా.
ఋజుమార్గములో నడు అంటుంది
ఎచ్చటి కెళ్ళిన ఎప్పటి కొచ్చిన
ఏమిటి బాబని గద్దిస్తుంది
ఐనా ప్రేమతో ఆదరించేది అమ్మేరా
ఒక ముద్దిమ్మని ముచ్చట పడును
ఓ నా చిట్టని అక్కున గొనును
ఔరా ఎంతటి వాడవైతివని
అందరు నిన్నూ పొగుడు తుండగా
అః అని పొంగి పోయేది అమ్మేరా

సిరి చుక్క మొగ్గ

# గాలి పటం

చక చక ఎగిరే గాలిపటం
రెప రెప లాడే గాలిపటం
బాల లందరికి పరమానందం
తెచ్చే ముచ్చట గాలిపటం

ముక్కుకు కళ్ళెం కట్టాము
ముద్దుగ తోకను పెట్టాము
రంగు రంగులా గాలిపటం
రాజ ఠీవి గల గాలిపటం

దారం వదిలితె దూరం పోవును
గారం చేసిన మారం చేయును
మబ్బుల దూరే నిబ్బర మేమో!
అల్లరి చేసే అబ్బుర మేమో!

పడగ విప్పిన పాము వోలెను
పగతో బుస్సున ఎగిరి దూకెను
నాట్యంలోన నెమలిని మించెను
పక్షితో తాను పందెం వేసెను

బాలలే తనకు భాగ్యమన్నదీ
స్వేచ్ఛకు తానే పతాకనన్నది
అందరి చూపులు నిలిపిందీ
అందని ఆశలు నింపిందీ.

# భారత దేశం మా దేశం

మా దేశం మా దేశం
భారత దేశం మా దేశం

ధన ధాన్యాలూ సకల సంపదలు
రత్నరాసులతో రాజిల్లినదీ...
ఋషి పుంగవులూ వెలసిన దేశం
యజ్ఞయాగాలు చేసిన దేశం

సత్యనిష్ఠకూ సన్మార్గానికి
శీల సంపదకు ఆలయ మైనది
శాంతి దాంతి మా సందేశం .
అహింసయే మా ఆదర్శం

# గౌరీశంకర్

గోళాకారం భూమ్యాకారం
రెండు చలనాలు భూమి కున్నవి
తానే తిరుగును తన చుట్టూ తా
తిరుగు చుండునూ సూర్యుని చుట్టూ .

చిన్న ఖండ మట ఆస్ట్రేలియా !
పెద్ద ఖండమే ఆసియా మనదీ
ఎత్తగు గిరులు హిమాలయాలు
పీఠభూమి టిబెట్టు ఎత్తురా !

పర్వతాలలో నదులు పుట్టునూ
నదులు సంద్రాన కలియుచుండునూ
చిన్న నదులు పెద్ద నదిలో కలియగ
ఉపనదు లందురు వీటి నందరు .

తిమింగిలం జలచరాల పెద్దది
భూచరాలలో ఏనుగు పెద్దది
నదులన్నిట గొప్పది అమెజాన్
మహా సాగరం పసిఫిక్ అదిగో !

ప్రపంచ ప్రసిద్ధ సుందర భవనం
అంద రెరుగుదురు తాజమహాలును
గౌరీశంకర శిఖర మున్నతం
ఎల్లరు దీనిని ఎవరెస్టందురు .

# సత్యం నిత్యం...

బాగా చదివి విద్యలు నేర్చి
బుద్ధిమంతు డనిపించాలి.

సత్యం నిత్యం పలుకుట వీడకు
అబద్ధాలు అసలాడ కూడదు
హరిశ్చంద్రుడు అసత్యమాడక
శాశ్వత కీర్తిని పొందాడు.

దొంగతనం మరి చేయకూడదు
దొరవని అందరు పొగడాలి
పరుల సొమ్ము ఆశింపగ రాదు
ఒరుల మనసు నొప్పింపగ రాదు.

అహింసలోనే అందం ఉంది
జీవహింసలో మేలే లేదు
బుద్ధుని బోధలు చదివి తెలుసుకో
ముద్దుగ బుద్ధిగ మెలగ నేర్చుకో.

శాంతి మార్గమే సర్వ విధాలా
క్షేమకరంబని తెలియాలీ
బాల బాలికలు పెద్దలన్నచో
భక్తితొమన్నన చేయాలి.

దేశమన్ననీ ప్రాణ మీయవలె
పేద ప్రజలకూ సేవ చేయవలె
దేశ భక్తితో భరత మాతను
దేవత వలె పూజించ వోయ్.

# పుణ్యా మాత నమస్తే
# ప్రియభారతి నమస్తే

భరత మాత నమస్తే !
భారతాంబ నమస్తే !
పుణ్యమాత నమస్తే !
ప్రియ భారతి నమస్తే !

హిందువులు, ముస్లింలూ
అందరు నీ బిడ్డలే !
మతాలెన్నొ మాకువున్న
మాతవు అందరికి నీవె.

పూర్వ జన్మమందు నేను
పూజలేమి చేసినానొ !
భరతమాత నీ బిడ్డగ
పుట్టినాను పుణ్యాన.

శాంతీ, సహజీవనం,
సౌజన్యం, సౌహార్ద్రం
ఇవే మాకు శరణ్యం
ఇవే మాకు రక్ష నిజం.

# చుక్కల నడుమ
# చక్కని చంద్రుడు

చుక్కల నడుమా చక్కని చంద్రుడు
బాలల మధ్యా పండిత నెహ్రూ
అందరు మెచ్చే సుందర మూర్తి
అందరు ముచ్చట పొందే కీర్తి

ముసి ముసి నవ్వులు విసిరే నెహ్రూ
ముద్దుల మాటల మూటల నెహ్రూ
కలలో లీలగ కదిలే నెహ్రూ
కమ్మగ మదిలో మెదిలే నెహ్రూ

మరవా లన్నా మరపే రాదూ
అలసి ఏడ్చినా అసలే రాదూ
పాపం చేయని పావను కాదా ?
కోప మెందుకో కోరి పిలవగా !

# అమ్మ - నాన్న - మేము

నాన్న ఎదుట వున్న మేము
నంగనాచు లవుతాము
అమ్మ చెంత వున్న మేము
ఆడెదము...పాడెదము.

ఆకసాన సూర్యుడెంతో
ఆగ్రహించు అందరిపై
మబ్బులలో చందమామ
మచ్చికనే చేయుచుండు.

నాన్నంటే భయం మాకు
అమ్మంటే అలుసు మాకు
సూర్యుడంటె చూడలేము
చంద్రుడంటె హాయి మాకు.

ఎర్ర పూవు సూర్యుడంట
తెల్ల పూవు చంద్రుడంట
ఆకసమే చెట్టేమో !
పూలు రెండు పూచెనేమో !

మినుకు మినుకు మను చుక్కలు
ముద్దు గారు చిరు మొగ్గలు
చంద్ర సూర్యు అమ్మ నాన్న
చుక్కలం మేము కాద ?

# విన్నావా ఈ చిత్రం ?
# కన్నావా ఈ చిత్రం ?

రాతి లోపలా కప్ప వుండుటా
కొబ్బరి కాయలో నీరు వుండుటా
చిత్రం చిత్రం...ఎంతో చిత్రం
విన్నావా? ఈ చిత్రం బాలా కన్నావా ?

పెద్ద చేప చిరుచేపను మ్రింగుట
సీతాకోక చిలుకే, గొంగళి పురుగట
చిత్రం చిత్రం...ఎంతో చిత్రం
విన్నావా? ఈ చిత్రం బాలా కన్నావా ?

కనబడ కుండా వీచే గాలి
ఆకాశంలో ఇంద్ర ధనుస్సూ
చిత్రం చిత్రం...ఎంతో చిత్రం
విన్నావా ? ఈ చిత్రం బాలా కన్నావా ?

# మేమంతా బాలకులం
# మాదంతా ఒకే కులం

మేమంతా బాలకులం
మాదంతా ఒకే కులం
మేమె భావి పాలకులం
మేమె దేశ సేవకులం

మాకెంతో మనో బలం
ఆత్మ బలం, దైవబలం
మాకున్నది కండబలం
అర్థ బలం, అంగ బలం

వర్తకులం, నర్తకులం
కార్మికులం, కర్షకులం
సైనికులం, నావికులం
వైమానికులం, వైతాళికులం

దేశ భక్తులం, దైవ భక్తులం
పితృభక్తులం, మాతృభక్తులం
గురుదేవ భక్తులం
సిరి చుక్క భక్తులం

# చల్లని దీవనలు అందుకోవాలి

తెల్లవారక ముందె నిద్ర లేవాలి
కాలకృత్యాలన్ని తీర్చుకోవాలి
పరిశుభ్రముగ పళ్లు తోము కోవాలి
గట్టిగా వళ్లంత రుద్దు కోవాలి.

చక్కగా నీవు తల దువ్వు కోవాలి
ఉతికిన బట్టలను కట్టుకోవాలి
దేవుణ్ణి భక్తితో ప్రార్థనచేయాలి
తల్లిదండ్రుల పాదపూజ చేయాలి

తప్పకుండా బడికి ఎప్పుడూ వెళ్లాలి
అందరకు మెరుగ్గా చదువు కోవాలి
మంచి మార్కులే నీకు రావాలి
మంచి వాడని పరులు మెచ్చుకోవాలి.

పిల్లలందరితోడ కలసి వుండాలి
అల్లరి చేయకా ఆడు కోవాలి
ఎల్లరికి వినయముగ మసలుకోవాలి
చల్లనీ దీవెనలు అందు కోవాలి.

# ఏమంటావే అమ్మా… ?
# కాదంటావా అమ్మా…

అమ్మా! ఆ చెట్ల క్రింద
పేదలు పడి వున్నారే
మట్టిలోన వారంతా
అట్టే పడుకుంటారే .

అందమైన పెద్ద మేడ
అమ్మ మనకి వుంది గదే
అందర్నీ రమ్మంటా
అందర్నీ ఉండ మనవే .

చల్లనైన తోట లోన
చక్కనైన మేడలోన
మనమె ఉండలే మంటివి
ఊటీకే వెళ్ళాలంటివి .

అమ్మ ఏల ఈ మేడ
వారందరి కిచ్చేస్తా
లేక పోతె ఊటీకీ
రానే రానె అమ్మా .

ఏ మంటావే అమ్మా?
కాదంటావా అమ్మా?
నా మాటను వినకుంటే
నాన్న జట్టు పోతాను .

# బాలలమైనా పౌరులమౌతాం

సహించ గలమా ? వహించ గలమా ?
దేశ దేశాలు ధ్వంసం బైనా...
బాలల మైనా పౌరుల మౌతాం
శాంతి సమరాన్ని సాగిస్తాం .

ఆటం బాంబులు అణ్వస్త్రాలు
ఆపివేయమని ప్రయోగాలను
అగ్రరాజ్యాల నర్దిస్తాం
ఇలలో శాంతిని స్థాపిస్తాం .

అంతర్యుద్ధాల్ మాపేస్తాం
ప్రపంచ యుద్ధం వద్దంటాం
వసుధైక కుటుంబం కావాలంటాం
శాంతి గీతికల నాలాపిస్తాం .

గాంధీ తాత సిద్ధాంతాలనె
పాటించాలని ప్రేమతో చెప్తాం
గాంధీ తాతా చూపిన బాటే
రాజమార్గమని నిరూపించుతాం .

# గొప్పగొప్ప విషయములను ఎల్లప్పుడు తెలుసుకొనుము

గొప్ప గొప్ప విషయాలను మరువకా
తెలుసు కొనుము ఎల్లప్పుడు తప్పకా !

నవరత్నాలను కవులు వుండిరి
గుప్త రాజుల ఆస్థానం పండి
కాళిదాసు అందులో ప్రసిద్ధుడూ
కమ్మని కవితలు అల్లె నాతడూ .

అష్ట దిగ్గజాలను కవులుండిరి
కృష్ణ రాయలా ఆస్థానంలో
అర్థశాస్త్రమును సద్గ్రంధాన్ని
కౌటిల్యుండు రచించినాడు .

మొగలు రాజ్యస్థాపకుడు బాబరూ
ఘనుడు మొగలు చక్రవర్తుల్లో అక్బరు
మహారాష్ట్ర నాయకుడు శివాజీ
మహానాయకుడు మహాత్మగాంధి.

# భారతాంబ బాలలం
# భావి భరత నేతలం

బాలలం...బాలలం
భారతాంబ బాలలం
భావి భరత నేతలం
బాటను చూపించుతాం.

పేద బాధ తీర్చుతాం
ప్రేమతోను పలుకుతాం
సమ సమాజ నిర్మాణం
సత్వరమే కోరుతాం.

కుల మత తత్వాలు విడిచి
కూర్మితోను మెలగాలని
ఊరూరను చాటుతాం
ఓర్మిని దర్శించుతాం.

అధర్మం అగుపడినా
అన్యాయం అడ్డుపడిన
ఎదిరిస్తాం, బెదిరిస్తాం,
హడలగొట్టి పడగొడతాం.

దుర్మార్గం, దుష్టత్వం
దుమ్ము వదల గొట్టేస్తాం
క్రూరత్వం, కుయుక్తుల్ని
కూల బొడిచి చంపేస్తాం.

# నేల, నీరు, గాలి

ప్రయాణమే ... ప్రయాణం
నేల, నీరు, గాలి యందు
ఎంతో వింత చూడచూడ .
స్లెడ్జి బండి, ఎద్దు బండి
గుర్రబ్బండి, రిక్షా బండి
రైలు బండి , ట్రాం బండి
ఎలక్ట్రిక్ ట్రైన్, ఆటో రిక్షా
సైకిళ్ళూ , మోటార్లూ
భూమిపై ప్రయాణానికి
వాహనాలు, సాధనాలు .
ఏనుగు, ఎద్దు, ధ్రువపుజింక,
ఎస్కిమో కుక్క, జడలబర్రె
గాడిద, గుర్రం, ఒంటె ఆహా !
నేలపై ప్రయాణానికి
నిజముగ జంతువు లెంతో
సౌకర్యం కల్గించును.
తెప్ప, దోనె, పడవ, లాంచి
స్టీమరు అదె, ఓడ చూడు !
జలాంతర్గామి చూసితివా ?
నీటిలోన ప్రయాణమూ
పాటలాగ సాగిపోవు!
గగనంలో విమానమూ
గమ్మత్తౌ ప్రయాణమే .

# అ ఆ ఇ ఈ ఉ ఊ
## ఒకటీ రెండూ మూడు

ఆ ఆ ఇ ఈ నేర్వాలీ
అక్షరా లన్నీ రావాలి
అటు నిటు చూడక దిద్దాలీ
శ్రద్ధగ మీరూ చదవాలీ.

* * *

అక్షరాలన్నీ వచ్చాయా?
అయితే చెపుతా వింటారా?
గుణింతాలు ఇక నేర్వాలీ
గణగణ మంటూ చదవాలీ.

* * *

ఒకటి, రెండు, మూడు, అంకెలు,
సంఖ్యలు వస్తే ఎక్కాలొస్తాయ్
ఎక్కాలన్నీ బాగా వస్తే
లెక్కలు చక్కగ చేస్తారు.

* * *

తెలుగు భాషకూ
మన చక్కని తెలుగు భాషకు
అక్షరాలు యాభైయా రని
తెలియండి, ముద్దుగ చదవండి.

* * *

అక్షరా లన్నీ నేర్చేస్తేనే
చిటికలోన ఈ పుస్తకాలనే
చకచక మంటూ చదివేస్తారూ...
పెద్ద లందరిని మురిపిస్తారు.

# పతంగమే యిక ప్రయాణ మాయెను

ప్రాణం పోసిన పిల్లల వీడి
ఆకాశంలో మబ్బుల కూడి
గాలి తేరుపై కలకల లాడుతు
పతంగమే యిక ప్రయాణ మాయెను .

ఊగుతు తూగుతు ఎగురు తున్నది
హుషారుగానూ పెరుగు తున్నదీ
ముచ్చటగా అది కన్పిస్తున్నది
ముద్దొస్తున్నది, మురిపిస్తున్నది .

తక్కుతు తారుతు తారట్లాడుతు
తళుకులు బెళుకులు ఒలికిస్తుంది
వంపులు సొంపులు ఒయ్యారంగా
కులుకుతు పలుకుతు పోతూవుంది .

సరసా లాడుతు వుండమన్నది
సంబరాలు కొని తెస్తానన్నది
ఆటలు పాటలు ఆడిస్తున్నది
అల్లరి ఎంతో చేయిస్తున్నది .

గాలి పటాల ఆటల తోటి
కాలం మరచీ గలగల నవ్వుతు
నిండు మనసుతో పండుగ జరిపే
బాలలదే అదృష్టం ఆహా !

# విజయ సీమ

మనదేశం ... మనదేశం
మనదే హిందూ దేశం.

పాడి పంటలు ఫల పుష్పాలు
చెట్టు చేమలు నదీ నదాలు
పచ్చని పైరులు ఎచ్చట చూచిన
ముచ్చటైన మన భారతదేశం .

సాహస మిక్కడ జన్మించినది
పౌరుష మిక్కడ పుట్టి పెరిగినది
ధర్మ భూమి యిది, కర్మ భూమి యిది
వీరులు పుట్టిన విజయ సీమ యిది.

రామరాజ్య మనిపించిన దేశం
పాండవ వీరుల కన్న దేశమూ
ప్రతాపరుద్రుడు, కృష్ణరాయలూ
వీర శివాజీ ఏలిన రాజ్యం.

రుద్రమదేవి, ఝాన్సీలక్ష్మి
ఇందిరగాంధీ, దుర్గాబాయి
భారత నారీ రత్నాలే
భారతీయులా పుణ్యాఫలాలే.

గాంధీ, శాస్త్రిని కన్న దేశమూ
సుభాస్ చంద్రులూ, భగత్‌సింగులూ
పొట్టి శ్రీరాములు పుట్టిన దేశం
త్యాగనిరతికీ తావగు దేశం

# అన్నికులా లొక్కటే
# అన్ని మతాలొక్కటే

బాలలం...బాలలం
భారతీయ బాలలం...
భవిష్యత్తుకు బాటలం
భరత మాత బిడ్డలం...

హిందువులం, ముస్లిములం, క్రైస్తవులం
బౌద్ధులం, శిక్కులం, జైనులం
మత భేదాల్ మరచి పోయి
మెలుగు తాము కూటముగా.

అందరు మానవు లొకటే
అన్నికులా లొక్కటే ,
అందరి కొకడే దేవుడు
అన్ని మతా లొక్కటే.

మనలో భేదాలు మనకు
మంచిది కాదని చెపుతాం
మన మందర మొకటి గానే
మనవలెనని కోరుతాం.

బడిలోన అందరం
గుడిలోన అందరం
కలసి మెలసి తిరుగుతాం
అలసి సొలసి ఆడుతాం.

# ఆకలి మంటలు
# చీకటి బ్రతుకులు

హోరు హోరుగా గాలి వీచెను
జోరు జోరుగా వాన కురిసెను
పరుగులు తీసెను వాగులు వంకలు
ఉరకలు వేసెను నదీ నదాలు.

ఆకలి మంటలు చీకటి బ్రతుకులు
చీకులు చింతలు పేదల బాధలు
వానా తీర్చదు, గాలీ తీర్చదు
తీర్చాలండీ చదివే బాలలు.

వాగులు వంకలు తీర్చనె తీర్చవు
నదీ నదాలు అసలే తీర్చవు
ఆర్చి తీర్చి ఆదుకోనండీ
చక్కగ చదివే చల్లని బాలలు.

# గుళ్ళో దేవుడు
# బళ్ళో పంతులు

కలముకు పాళి
హాలముకు కర్రు
ఫలముకు తీపి
పొలముకు ఎరువు.

ఆటకు యుక్తి
పాటకు రాగం
మాటకు సత్యం
వేటకు ధైర్యం.

దాగుటకు చాటు
సాగుటకు బాట
లాగుటకు శక్తి
తాగుటకు పాలు.

నేత్రానికి చూపు
గాత్రానికి పలుకు
యాత్రకు భక్తి
మాత్రకు చేదు.

తలపుకు కళ్ళెం
తలుపుకు గొళ్ళెం
గుళ్ళో దేవుడు
బళ్ళో పంతులు.

# మన దేశంలో...

మనదేశంలో మంచి సంగతులు
మననంచేద్దాం మన మొకసారి.

కలకత్తా, బొంబాయ్, మద్రాస్ వరసగ
పెద్ద నగరాలు భరతదేశములో,
ఎంతో ఎత్తు బొంబాయ్ భవనాల్
ఎత్తగు డాము భక్రానంగల్.

నాణ్యమైన నౌకల నిర్మాణం
విశాఖపట్నం ఓడరేవు కడ,
విమానాలు ఒహో! బెంగుళూరులో
ఒకేచోట నిర్మాణం జరుగును.

మద్రాస్, కాన్పూర్ చర్మపరిశ్రమ,
బరోడా, బొంబాయ్, పూనా, సేలం
అహమ్మదాబాద్, హైదరాబాద్
షోలాపూరులో జౌళి మిల్లులూ.

అభ్రకం గనులూ నెల్లూర్ జిల్లా,
కొబ్బరి మలబార్ తూర్పు తీరాలు
జలపాత మున్నదీ కావేరి నదిపై
శివసముద్ర జలపాత మందురు.

సింధు నదెంతో పొడవు అయినదీ
నీరు ఎక్కువా గంగానదిలో
కృష్ణా నదిపై పొడవగు బ్యారేజ్
దీనిపేరు ప్రకాశం బ్యారేజ్.

# జ్ఞానదంత : ప్రాణదంత

సూదులతో పొడుచుచూ
కత్తులతో కోయుచునూ
మంచివా రనిపించెనా ? డాక్టరు
చెడ్డవా రనిపించెనా ?

*　　　*　　　*

వ్యాధులను మాన్పును
ఆరోగ్యం కూర్చును
ఆనంద భాగ్యమిచ్చు, నిజంగా
దేవుణ్ణి మరపించును.

*　　　*　　　*

మొట్టునూ .... తిట్టునూ
కోపపడి కొట్టునూ
మంచివా రనిపించెనా ? మాష్టారు
చెడ్డవా రనిపించెనా ?

*　　　*　　　*

మనసు మెత్తన, మాటలు కఠినము
జ్ఞానము నొసగును మాష్టారు
విజ్ఞానము నొసగును మాష్టారు
భవిష్యత్తు కోరునూ మాష్టారు

*　　　*　　　*

తెలిసిందా....? తెలిసిందా ?
కనిపించేది.... వినిపించేది
కఠినం, కష్టం అనిపించినను
మంచికే నని తెలిసిందా ?

# పాడుదమా?
## ఆడుదమా?

మళ్లీ మళ్లీ పాడుదమా ?
మరి మరి తలచీ ఆడుదమా ?

త్రివర్ణ పతాక జాతీయ పతాక
జన్మదాత పింగళీ వెంకయ్య.
అశోక చక్రం వుంది మధ్యన,
ధర్మ చక్రమని దీని నందురు.

యమునా తీరాన ఢిల్లీ అదిగో!
రాజధాని అది మన దేశానికి.
తెలుగు రాజధాని హైదరాబాద్
ఎంతో సుందరమైన నగరము.

# శాస్త్రజ్ఞుల శ్రమ

తెలుసుకోండి తెలుసుకోండి
శాస్త్రజ్ఞుల శ్రమ ఫలితం ...

కాగితాన్ని కనిపెట్టిరి
చైనా శాస్త్రజ్ఞులంట !
ముద్రణా విధానాన్ని
గ్యూటెన్‌బర్గే చూపెను .
ఆవిరి యంత్రం ఆహా !
జేమ్స్‌వాట్ శ్రమ కాదా !
పెన్సిలిన్ మందు కనిపెట్టింది
ఫ్లెమింగ్ మొదటా ఫ్లోరీ అటుపై .
క్లోరోఫారం సింప్సన్ ఫలితం
అల్యూమినియం లోహమ్మును
అయ్యోర్ స్టైడ్ అందించాడూ .
వినీల ఆకాశంలో ఎగిరే
విమానాన్ని ఆ రైటుసోదరులు
అందరు వింటూ ఆనందించే
రేడియో మార్కోనీ సృష్టి !
వైర్‌లెస్ అందురు దీని నందరూ.
టెలిగ్రాఫు అదే! టెలిఫోను ఇదే!
ఎడిసన్ వరమే ఎల్ల ప్రజలకివి
చెట్లకు మనవలె సుఖదుఃఖాలు
చెప్పెను కలవని జగదీశ్ బోసు.

# జన్మదినం పర్వదినం

జన్మదినం ... జన్మదినం
జవహర్ బాబు జన్మదినం
బాలలందరీ పర్వదినం
ప్రపంచానికే భలే దినం..

భారతీయులకు దారి చూపగా
ప్రపంచానికే వెలుగు రూపుగా
కుల మత తత్వం రూపు మాపగా
అవతరించెను అవని యందున.

విశాల హృదయం కలగాలంటూ
వివేకముతో మెలగాలంటూ
విశ్వప్రేమనే చాటాడు
విను వీధిని తా నిలిచాడు.

బాల లందరిని ప్రేమించాడు
భావి పౌరులని మురిశాడు
బాలలు ప్రేమతో తలచారు
భారత నేతను కొలిచారు.

పున్నమి చంద్రుడు పండిత నెహ్రూ
పుట్టిన రోజూ పండుగ మనకు
అమర జీవి మా నెహ్రూజీ ...
విమల మూర్తి మా నెహ్రూజీ ...

# రాచిలుక
# రాబందు

మంచి మంచి మాటలతో
గొంతులు కోసే వారు
ఉన్నారురా మనలోనే
కన్నావా ఎపుడైనా ?

రాబందు ఎంతో ఎత్తు
ఎగురు తున్నది
దాని మనసు శవాలపై
తిరుగుతున్నది.

రాచిలుక పంజరాన
రే బవలు చెప్పు కథలు
అలకలనే మరపించును
నలుగురినీ మురిపించును.

పెద్దలనీ పేరు పొంది
గ్రద్దలవలె తిరుగు టేల ?
పిన్నలవలె వున్న నేమి ?
పన్నీరును చిలుకుటకై .

రాబందులన్ని కూడ
రాచిలుక లైన నాడు
రామరాజ్య మీ యుగమై
మరపించును కలియుగమే.

# ధీరులందరీ శక్తి ఫలం
# వీరులందరీ రక్త ఫలం

స్వాతంత్ర్య దిన మిదిరా ... భారత
స్వరాజ్య దిన మిదిరా ...

ధీరు లందరీ శక్తి ఫలంరా ...
వీరు లందరీ రక్త ఫలంరా ...
మాతృ భూమిపై మమతతోడనూ
త్యాగం చేసిరి భారత వీరులు.

తల్లి భారతీ దాస్య శృంఖల
త్రుంచి వేయుటకు ప్రతినబూనిరీ
దేశభక్తితో దీక్షను పూనీ ...
తమ ప్రాణాలను త్యాగం చేసిరి.

అందరి ఐక్యత కోరి గాంధిజీ
అంధకారాన్ని బాపినాడురా ...
శాంతి సమరాన్ని చక్కగ నడిపీ
స్వరాజ్య సిరులూ తెచ్చియిచ్చెరా.

ఎచ్చట చూసిన పచ్చతోరణాల్
కరతాళాలే కమ్మని పాటలే
ఊరేగింపులు ఉత్సవాలతో
ఊయల లూగెను మన దేశం.

# సరిగమ పదనిస
# సనిదప మగరిస

స. రి. గ. మ...ప. ద. ని. స
స. ని. ద. ప ... మ. గ. రి. స.
సరసాలాడుదమా ...
సంగీతం పాడుదమా.

ఆనందాలే పొందాలి ...
అందరు ఒకటిగ వుండాలి
హద్దులు మీరక వుందామా
శ్రద్ధగ చదువు కుందామా.

బుద్ధిగ మనమూ మెలగాలి
ముద్దుగ మనమూ అలగాలి
ఎప్పుడు మంచనిపించాలి
ఎల్లప్పుడు సత్యం పలకాలి.

పేదల బాధలు తీర్చాలి
పరోపకారం చేయాలి
మనలో మనకు తగువు లెందుకు
అందరు కలసి మెలగాలి.

ఆంధ్ర మాతకు అలంకారముగ
అందరు మాలగ కూడాలి
అందరు మెచ్చుచు చూడాలి
మన మంతా శోభగ వెలగాలి.

# ఆశీస్సులు అందుమురా
# ఆనందం పొందుమురా

అమ్మను మించిన దేవత
అగుపించున భువిలోన
నాన్నకు సరియగు దైవం
కనిపించున ఇలలోన.

అమ్మ దీవనలు వుంటే
అన్నింటను జయమగురా
అమ్మను మదిలో మరువక
అనవరతం సేవించర.

నాన్న దీవెనే మనకు
నారాయణు దీవెనరా
నాన్న పూజలే మనకూ
నారాయణు పూజలురా.

ప్రత్యక్ష దైవాలను
మరువ రాదురా...
మరచినచో నీ కిలలో
మనుగడేదిరా...?

అమ్మను నాన్నను మించి
అవనిలో గలరే అధికులు
ఆశీస్సులు అందుమురా
ఆనందం పొందుమురా.

# జిలుగు తోటలోయ్
## వెలుగు బాటలోయ్

తెలుగు జాతి ఒక ప్రాటిని
నడువ నెంచునోయ్
తెలుగు జాతి దినదినం
ప్రగతి జెందునోయ్
తెలుగు వెలుగు కలకాలం
కలసి ఉండునోయ్
తెలుగు పలుకు తియ్యదనం
ముదము నిచ్చునోయ్
శతాబ్దాల పరపాలన
చెల్లిపోయెనోయ్
దశాబ్దాల మనపాలన
దారి కొచ్చెనోయ్
తెలుగు వారలంత
ఒక్కచోట జేరగా
తెలుగు తల్లి ఆశలన్ని
పూచి పండెనోయ్
తెలుగు వాడు దశదిశలకు
దారి చూపునోయ్
తెలుగు నాడు తరతరాలు
తేజరిల్లునోయ్
తెలుగు తల్లి భావనలే
జిలుగు తోటలోయ్
తెలుగు తల్లి దీవనలే
వెలుగు బాటలోయ్

# భావం-భాష

భావం తెలిపే మార్గం భాషలు
బాలల్లారా...భాషలు తెలిసీ
నాటికి నేటికి భేదం తెలిసీ...
బాగా చదవండీ, బాటను వేయండీ.

అభిప్రాయాలు మనుషులు పూర్వం
గుర్తులద్వారా బొమ్మల ద్వారా
తెలుసుకొనిరనీ తెలియండీ.

కోయలు, గోండులు, చెంచులాదిగా
అడవి ప్రజలు మాట్లాడే భాషకు
లిపిలేదని మీరెరుగండీ.

మనదేశంలో హిందీ భాష
ప్రపంచానికీ ఇంగ్లీషుభాష
సామాన్య భాషలని తెలియండీ.

# సంఘటన
# పరివర్తన

ఏదో ఒక సంఘటన
ఎంతో మార్పు తెచ్చు
వింతగొల్పు ఆ ఘట్టమె
అంతులేని కాంతి నిచ్చు.

అశోక ప్రభువు
కళింగ యుద్ధమె
అతని శాంతి, ధర్మ
మార్గానికి మూలం.

గౌతముడే ఆహా!
బుద్ధు డగుటకు
చెన్నయ్యతో
పట్టణ విహారమే.

ఝాన్సీ కోటను ఆంగ్ల రాజ్యాన
కలిపి వేయగా
వీరనారియై విహరించింది
లక్ష్మీబాయి.

# పాలన భారం
## వీరిదే సుమా!

గ్రామంలో పరిపాలన ఎట్టిదో ?
తాలూకా పరిపాలన ఎవరిదో ?
జిల్లా, రాష్ట్రం పాలన ఎవరిదో ?
తెలుసుకొందము తెలివి గల్గగా.

పట్వారంటే కరణం - పటేలంటే మున్సబ్
గ్రామంలో అధికారులు వీరే,
తాలూకాలో తహసీల్దారు,
జిల్లాలోన కలెక్టరుండును,
రాష్ట్రంలోన గవర్నరుండును
పాలన భారం వీరిదే సుమా!

గ్రామంలో అల్లరులు జరుగగా
పోలీసు వారికి తెలియజేయును,
జనన మరణాల జాబిత వ్రాయును,
అంటు వ్యాధులే సంభవించినా
తాలూకాఫీసున తెల్పును మున్సబు,
పటేలనికూడందు రీయనను.

నేరుగా గ్రామాధికార్లను
గవర్నమెంటే నియోగించును,
కరణం లెక్కలు తయారు చేయును,
పటేలు పన్నులు వసూలు చేయును.

# ఆగస్టు పదిహేను
# స్వాతంత్ర్య దినమూ

ఆగస్టు పదిహేను వచ్చిందండీ
ఆనందాలను తెచ్చిందండీ
భారత ప్రజలా భాగ్యం నిండీ
స్వేచ్ఛను పొందిన శుభదినమండీ.

ప్రతి గృహములో పచ్చతోరణం
దివ్యకాంతులే నవ్యశోభలే
నలుదిశ లందున వెలుగు నింపుచు
కనుల పండువుగ కనబడుచుండెను.

పారతంత్ర్యం పోయిందండీ
స్వతంత్ర రాజ్యం మనదేనండీ
సహకారంతో మెలగాలంటూ
సర్వ ప్రజలకూ చాటి చెప్పేదం.

ఆగస్టు పదిహేన్ స్వాతంత్ర్యదినమూ
అందరకూ ఆనందమైనదీ
భారతమాతకు జై జై యంటూ
భక్తితోను పూజించగ రండీ.

# దేశం - సందేశం

ఈనాటి బాలల్లారా!
రేపటి పౌరుల్లారా!
మీదేనండీ దేశం
వినరండీ సందేశం.

ఐకమత్యంగ మెలగాలి
అందరు ఒకటని చెప్పాలి
భేద భావాలు మరవాలి
భారతీయు లనిపించాలి.

న్యాయం, ధర్మం, సౌభ్రాత్రం
నాల్గు దిక్కులా చాటాలి
అవినీతి దరిజేరకుండగా
అందరు తప్పక చూడాలి.

దేశం కోసం ప్రాణాలొడ్డిన
త్యాగజీవులను తలవండి
నిస్స్వార్థంగా దేశసేవకై
నడుం బిగించీ నడవండి.

రామరాజ్యమని పొగడిన దేశం
రత్నరాసులకు నిలయమైనది
విశ్వఖ్యాతి నార్జించిన దేశం
భారత దేశం మనదేనోయ్.

# త్యాగధనులు స్మరణీయులు

రైతు పంట అధికంగా
పండించగ ప్రతినబూన
కొరత యిట్టె తీరిపోవు
కడుపుమంట లారిపోవు.

ఆకలి పేరిటి శత్రుని
హతమార్చును రైతన్న
పగలు రేయి ఎండవాన
కోర్చి కాచు రైతన్న.

శత్రువులను పారద్రోల
సైనిక సోదరుడడుగో !
సరిహద్దులు కాయుచుండె
శత్రుదాడి రాకుండా.

మంచులోన చలికోర్చి
దేశభక్తి దీక్షతోడ
మాతృభూమి రక్షణకై
కాపాడును కనురెప్పగ.

సైనికుడూ, కర్షకుడూ
దేశానికి రక్షకులే!!
దేశ ప్రజలు మరువరాని
త్యాగధనులు స్మరణీయులు.

సిరి చుక్క మొగ్గ

# నేటి బాలలే
# రేపటి పౌరులు...

పెద్దలు చెప్పే మాట వినండి
ముద్దుగ మీరూ నడుచుకోనండి.

క్రమశిక్షణ పాటించాలి
నెహ్రూ ఆశలు తీర్చాలి
నేటి బాలలే రేపటి పౌరులు
సూక్తిని ఫలితం చేయాలి.

నెహ్రూజీకీ మీకంటేనే
ఎంతో ప్రేమ తెలుసునుగా
భారతదేశం భావి నాయకులు
మీరని ఎంతో మురిసెనుగా.

దేశభక్తితో మెలగాలి
దీనులయెడ దయ చూపాలి
దేశ ప్రజలు నీ సౌభాగ్యం
దేశ క్షేమమే నీ క్షేమం.

భారతాంబకూ జేజేలూ
శాంతి దూతయై క్రాంతి దాతయై
నవభారత నిర్మాతగ వెలసిన
నెహ్రూ చాచాకు జోహార్లు.

# తెలుగు నాట వెలసినవి!
# పుణ్యామోక్ష మందిరాలు !!

రాజధాని నగరులోన, వరంగల్లు, వాల్తేరు, తిరుపతిలో
విశ్వవిద్యాలయాలున్నవి ! విశిష్ట విద్యాపీఠాలు !!
విశాఖపట్నం, విజయవాడ, హైదరబాద్, కడపలందు
రేడియో కేంద్రాలున్నవి ! వినోద, వికాస మందిరాలు !!

ఖాజీపేట, గుంతకల్లు, విజయవాడ, వాల్తేరు
సికింద్రాబాదులందు రైల్వే కూడలు లున్నవి !!
కళింగపట్నం, విశాఖపట్నం, మచిలీపట్నం, భీమునిపట్నం
కాకినాడ, వాడరేవు, ఓడరేవులున్నవిచట !!!

* * *

శ్రీశైలం-మల్లన్న, సింహాద్రి-అప్పన్న !
కీసరలో శివదేవుడు, వాసరలో శారదమ్మ !!
ధర్మపురి నరసన్న, తిరుమల వెంకన్న !!!
యాదగిరి నరసింహులు, భద్రగిరి శ్రీరాములు.

అలంపూరు బ్రహ్మయ్య, అన్నవరం సత్తెయ్య !
విజయవాడ దుర్గమ్మ, వేములవాడ రాజేశ్వరి !!
జీడిగుంట రామయ్య, కాళహస్తి శివయ్య !!!
ద్రాక్షారామ ఈశ్వరుడు-అంతర్వేది నరసింహుడు.

పాలకొల్లు క్షీరారామం-గునుపూడి సోమారామం
హైదరాబాద్ నగరంలో జుమ్మామసీదు వున్నది !
ఎంతో పెద్ద చర్చి అదే ! మెదకులోన వున్నది
తెలుగునాట వెలసినవి ! పుణ్య మోక్ష మందిరాలు !!

సిరి చుక్క మొగ్గ

# కాదంటావా నాన్నా ...?
# లేదంటావా నాన్నా ...?

పందు ముసలి పగలు రాత్రి
పనిచేస్తాడేమి నాన్న ?
తిండిలేదు కాబోలు !
తిప్పలు పడుతున్నాడు .

పొలానికేమో తాత!
పోవుచుండు రాత్రులందు
భయంలేదు కాబోలు !
బూచులన్న తాతయ్యకు .

ఎండలోన వానలోన!
బండలవలె బ్రతకనేల ?
పేద తాతలందర్నీ ...
పిలుచుకువస్తాను నాన్న .

కాదంటావా నాన్న ?
లేదంటావా నాన్నా ?
తగదన్నావంటే నే...
తాతయ్యతో పోతాను .

# పావనమౌ పుణ్యానదులు !!
# అన్నపూర్ణ తెలుగు నాడు!!

గోదావరి, కృష్ణానది, నాగావళి, వంశధార !
పంపానది, చంపానది, శబరి, శారదానదులు !!
ఉప్పుటేరు, తమ్మిలేరు, బుడమేరు, రొంపేరు
ఏలేరు, పాలేరు, మునేరు, మన్నేరు !!
సగిలేరు, చెయ్యేరు, పులంగేరు, కండ్లేరు!

చిత్రావతి, ఇంద్రావతి, పాయని, పాపాగ్ని !
మంజీర, మహానది, మూసీనది, మహేంద్రతనయ
స్వర్ణముఖి, ప్రాణహిత, గుండ్లకమ్మ, హంద్రినది !
తుంగభద్ర, పెన్నానది, భవనాశి, బాహుదాలు
తిరుగాడును తెలుగునాట ! పావనమౌ పుణ్యానదులు !!

* * *

నందికొండ, పోచంపాడు, రాళ్ళపాడు, మోపాడు
తుంగభద్ర, మునియేరు, ఎగువపెన్న, రొంపేరు !!
వంశధార, సోమశిల, భైరావాని... ప్రాజెక్టులు
గోదావరి ఆనకట్ట ! కృష్ణా, పెన్నా డాములు !!
సీలేరు, శ్రీశైలం ప్రాజెక్టులు, ఆహా ! జలశక్తులు !!

తెలుగు నాట వున్నవి ఇవి ! సౌభాగ్యాలకు మూలం !!
శ్రమ జీవుల కష్టమిది ! సాధించిన ఫలితమిది !!
ఇంటింటను పచ్చనైన తోరణాలు కనిపించును !
వీధి వీధి కళ్యాణపు వీరణాలు వినిపించును !!!
దేశానికి అన్నపూర్ణ ! నిజముగ, ఈ తెలుగు నాడు !

# భరత మాతకు మనం!
# బంగారు పుత్రులం!!

మేకవన్నె పులు లుంటాయి !
మ్రింగ పొంచి నిలుచుంటాయి !
రక్కసులను శిక్షించాలి !
ఒక్క త్రాటిపై నిలవాలి.

మాతృభూమి పరిరక్షణకై
ప్రాణాలైనా బలిచేద్దాం!
పరుల పాలనలో బ్రతుకేల ?
పోతే పోదాం సమరాన.

*　　*　　*

మాతృదేశం మించి అధికం
మనకు ఇలలో ఏమి ఉన్నది ?
మన ప్రాణములకన్న...
మాతృదేశం మనకు మిన్న.

తల్లిపేరును నిలిపి మనము...
ఎల్లలను చాటుటకు వెళదాం!
భరతమాతకు మనం లేమా ?
బంగారు పుత్రులం కామా ?

# తెలుగు దేశం మనది!

జీవనదులున్నట్టి తెలుగు దేశం మనది
జనగణంబుల కిది జీవన జ్యోతిరా...
ఆహా! కృష్ణానదీ, ఒహో! గోదావరీ
తుంగభద్రా, పెన్న, చూడరా పాడరా.

నన్నయ్య, తిక్కన్న, ఎర్రాప్రగడలు
మన తల్లి కన్నట్టి మహాకవులురా!
పోతన్న, పెద్దన్న పుట్టినట్టీ భూమి
భట్టుమూర్తి, శ్రీనాథుడు మెట్టినట్టీ భూమి.

త్యాగయ్య, క్షేత్రయ్య గానమాధురిలోన
తెలుగుదేశమ్మంత తేలిపాడిందిరా!
తెలుగుదేశంలోన ఆ మధుర గాయకులె
తెలుగుతల్లికి కీర్తి తెచ్చిపెట్టారురా.

పొగడరా ఒకసారి తెలుగు పౌరుషమూ
బాలచంద్రుడు, ఖడ్గతిక్కన్న ప్రతిభ!
తెలుగు పుత్రుల జూచి ఆనందమందరా!
తెలుగుతల్లికి నీరాజనా లివరా.

ఓరుగల్లు కోట, కాకతీయులనాటి
వైభవానికి గీటు, ప్రపంచానిదె మాట!
అమరావతి, ఘంటసాల అవి బౌద్ధ కేంద్రాలు
రామప్ప దేవళం శిల్పకళలో గొప్ప.

తెలుగు సీమలో జనన మందుటే మనకు
తెలియనీ పుణ్యంబు తెలియరా నీవు
తెలుగు తల్లీ మకుట అలంకారాలై
ఆదర్శ జ్యోతులై వెలుగొందవలెరా.

# అహింసా జ్యోతిగ వెలిశాడు

మహాపురుషుడు అవతార పురుషుడు
మహానాయకుడు గాంధి మహాత్ముడు
పుతలీబాయికి కరంచందుకూ
పోరుబందరను గ్రామ మందునా
పుట్టినాడూ మన పుణ్యము పండి.

పెండ్లియాడె కస్తూరిబాయినీ
చదువు కొరకు ఇంగ్లాండు వెళ్ళెను
తల్లియాజ్ఞ శిరసావహించెను
న్యాయవాదిగా చేరెను బాపూజి
బొంబాయ్ హైకోర్టునందున.

దక్షిణాఫ్రికా వెళ్ళి చూడగా
బ్రిటీష్ వాళ్ళు మన భారతీయులను
అమానుషంగా చూచుచుండిరి
మహాత్మ గాంధీ విజృంభించెను.
సహించలేక అవమానాలను.

సత్యం తప్పక, హింసను చేయక
ఎదుర్కొనెను తా నన్యాయాలను
భారతీయులకు నాయకు డాయెను
సత్యాగ్రహాన్ని సాగించాడూ
విజయాన్ని తా వరియించాడు.

భారతదేశం వచ్చిన వెంటనే
సబర్మతీ నది తీరం జేరెను
ఆశ్రమాన్ని అట నెలకొల్పాడు
ఖద్దరు కట్టాలని చెప్పాడు
అస్పృశ్యత పోవాలన్నాడు.

బ్రిటీష్ వారితో పోరాడాడూ
సత్యాగ్రహమే సాగించాడూ
స్వరాజ్యాన్ని మన కందించాడు
దుర్మార్గుని చేతికి బలి అయ్యాడు
అహింస జ్యోతిగ వెలిశాడు.

# జాలి గుండె! పూల గుండె!!

జాలి గుండెరా! పూల గుండెరా!
పండు వెన్నెలా నిండుమనసు గల
గౌతమబుద్ధుని జన్మభూమియే
భారతదేశం బంగరు పంటై.

కపిలవస్తు నగరం అదేనురా!
కారణజన్ముడు గౌతముడేరా
మాయాదేవికి శుద్ధోదనునకు
లేకలేక గల్గిన కుమారుడే.

తల్లి గండమున జనన మందెను
ఏడవ దినమున తల్లి పోయెను
సవతితల్లి గౌతమియె గాచెను
గౌతముడను నామమ్ము గల్గెను.

అందమైన యశోధర, భార్య
ఆమెకు కల్గె కుమారుడొక్కడే
భార్యాబిడ్డల వదలి పెట్టెను
భోగభాగ్యాలు విడిచి వెళ్లెను.

ఎందుకు ఈ ప్రపంచ సుఖాలని
నిందించుకొని కానల కేగెను,
జరామరణాలు జీవికి కలవని
సత్యజ్యోతినే చూసి మురిసెను.

సన్యాసమ్మును స్వీకరించెను
గయలో రావిచెట్టు క్రిందను,
ఆ రేండ్లతడు తపసుచేసెను
అతినిర్మల మానసమ్ముతో.

జ్ఞానం కలిగెను అప్పటినుంచీ
బుద్ధుడు అనునామమ్ము కల్గెను,
రావిచెట్టురా బోధివృక్షము!
ఇప్పటికిని అది అతిపవిత్రము.

అన్ని జీవులను ప్రేమించుమురా!
అహింసయే మన పరమధర్మము!
అందరి ప్రాణాలొకటేనయ్యా!
అన్ని వర్ణాలు సమానమే.

కోరికలే కష్టాలకు మూలం!!
ప్రేమయే మోక్షానికి బాటని
తన మతమ్మును సారనాథ్‌లో
కపిలవస్తు నగరమ్మున చాటెను.

# తెలుగు సీమ!
# భాగ్య సీమ!!

వరిపంట, జొన్నపంట, రాగి, సజ్జ, శనగలు
మొక్కజొన్న, మినుము, పెసలు, ఉలవలు
గోధుమలు, కందులు; కొర్ర, వరిగ, ఆరిక
తెలుగునాట, అవెఅవే ఆహారపు పంటలు!

*　　*　　*

ఆముదాలు, వేరుశనగ, కొబ్బరి
చెరకు, జనుము, మిరప, ఉల్లి,
పొగాకు, ప్రత్తి పంట, నువ్వులు ...
తెలుగునాట, ఇవెఇవే వాణిజ్యపు పంటలు!

*　　*　　*

చలువరాయి, సున్నపురాయి, ఉప్పురాయి
ముగ్గురాయి, పలకరాయి, నాపరాయి ...
బాక్సైటు, గ్రాఫైటు, స్టీటైటు, క్రోమైటు
రాతినార, మాంగనీసు, నేలబొగ్గు, సీసం, జిప్సం,
బంగారం, వజ్రాలు, రాగి, ఇనుము, అభ్రకం,
కలదు ఖనిజ సంపద! తెలుగునాట చూడరా!

*　　*　　*

పంచదార, పింగాణి; పట్టు, పలక, పీచు, గాజు
పొగాకుపని, నగిషీపని నూనెతీత, జనపనార నేత,
కాగితం, ఖాది, సిమెంటు, పేము, లేసు అల్లికాలు
బీడీలు, చుట్టలు; ఉన్ని, తోళ్ళు, బొమ్మలు
నూలు, నౌకా నిర్మాణం, సబ్బులు, అద్దకాలు
తెలుగునాట పరిశ్రమలు, తెలుగుబిడ్డ తెలియరా!

# తెలుగు సంస్కృతీ వైతాళికులు!!

ముక్కుపచ్చ లారనట్టి ముద్దు ముద్దు బిడ్డలను
మూడుకాళ్ళ ముదుసలలకు అమ్ముట నిరసించి,
ఆ మాటే నాటకముగ, వ్యావహారిక భాషలోన
"కన్యాశుల్కం" వ్రాసిన ఘటికుడు గురజాడ.

చిన్నతనమునందె, భర్తను కోల్పోయినట్టి
బాలికలకు పెళ్ళిచేసి చూపినాడు! ఆనాడే!
సంఘదురాచారాలను సంస్కరించ సమకట్టిన
గట్టివాడు, కలకాలం మరువలేని కందుకూరి.

అంటరానితనం బాప, ఇంటనె హరిజన బిడ్డల
పెంచినట్టి సంస్కర్త! రఘుపతి వెంకటరత్నం!
మూఢనమ్మకాల మీద గళమెత్తెను, కలమెత్తెను
తిరుగబడిన దిట్టయతడె త్రిపురనేని రామస్వామి.

మాట్లాడేభాషకు మన్నన తెచ్చె గిడుగు పిడుగు
మరపురాని "మాలపల్లి" నవల వ్రాసె ఉన్నవ
నడకలెన్నొ నేర్పినాడు సంగీతానికి ద్వారం!
ప్రాణాలను పోసినాడు చిత్రకళకు దామెర్ల.

నిజాం పాలనపై పోరాడెను మాడపాటి,
వరకట్నపిశాచిపై కలందూసె కాళ్ళకూరి!
దానంలో కర్ణుడు "దేశోద్ధారక" కాశీనాథుని,
గుండుకు తన గుండె నిచ్చె టంగుటూరి.

# రవీంద్రా!
# విశ్వ కవీంద్రా!!

రవీంద్రా ! విశ్వ కవీంద్రా !
భరతజాతి పసిడికలల ప్రోవా !
జాతిపితకే గురుదేవా ! !
జోహారు! జోహారు! జోహారు!

ప్రకృతిశోభకు ప్రణమిల్లావు
పరవశించి పదముల్లావు
పరమాత్మనె దర్శించావు
పరమార్థమునే చాటావు.

గీతాంజలి అతిమనోహారం !
పరమేష్ఠికి గ్రుచ్చిన హారం !
నిన్ను వరించే నోబెల్ బహుమతి
సంబరాన పరవశించె భరతజాతి!!

నీ కమ్మని కవితా గానం !!
విశ్వానికె మధుర మోహనం !
నీ గీతం సంగీతం కాగా !
నిలచెను రవిసంగీతముగా.

నీ కుంచెలో నిండెను కళలు !
నిఖిలజగాలకు కమ్మనికలలై !
నవభావ ప్రవక్త వీవై ...
జనగణమన జనకుడవైతివి.

వసుధంతా ఒకే కుటుంబం !
వర్ధిల్లాలని వాంఛించావు!!
శాంతినికేతన్ స్థాపించావు
సర్వప్రజలు ఒకటన్నావు.

# తెలుగురాజ్య వైభవాలు!
# తెలుగు పలుకు తియ్యదనం!!

గోలుకొండ, పెనుగొండ, కొండవీడు, పలనాడు
ఓరుగల్లు, పానుగల్లు, అమరావతి, రాజమండ్రి
శ్రీకాకుళం, చంద్రగిరి, బొబ్బిలి, విజయనగరం
తెలుగురాజ్య వైభవాలు! తెలుసుకొంటె భాగ్యమౌను !!

*    *    *

తెలుగుప్రజలు రాష్ట్రంలో నాల్గున్నర కోట్లుండిరి !
ఆంధ్రేతర రాష్ట్రాలలో ఒకటిన్నర కోట్లుండిరి !!
అమెరికాలో. ఆఫ్రికాలో, మలేషియా, మారిషస్
ఫిజీ, బర్మాలందున లక్షలాది తెలుగు ప్రజలు!!!

బస్తరు, బీదరు, చాందా; బళ్ళారి, చిత్రదుర్గ
గంజాం, రాయచూరు; కోలారు, కోరాపుట్టి
ధర్మపురి జిల్లాలలో తెలుగు నెలవులున్నాయి
నలుగడలా విలసిల్లెను తెలుగువారి సంస్కృతి.

భరతదేశ భాషలలో తెలుగుది రెండవ స్థానం!
ప్రపంచ భాషలందు పధ్నాల్గో స్థానమాయె !
ప్రాచ్యభాషలందు తెలుగు తలమానికమని తెలియుమ !
తెలుగుపలుకు తియ్యదనం! నుడికారపు సొంపుసొంపు !

"ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" పాశ్చాత్యులు ప్రశంసించె !
"దేశ భాషలందు తెలుగు లెస్స" కృష్ణరాయలన్నారు !!
దేశ విదేశాలందున, ప్రపంచాన నలుమూలల ...
తెలుగువెలుగు వెదజల్లుట తెలుగువారి కర్తవ్యం.

సిరి చుక్క మొగ్గ

# పక్షి - పెంపు

రండీ రండీ...రారండీ...

రండీ వేగమె...రారండీ...

పడమటి దిశగా పల్లె ఉన్నదీ!

పల్లెకు అమడ పోయి చూడగా

వెండి కొండలై కొండ లున్నవి

కొండల మధ్యా కోరి చూడగా

పుష్ప జాతులూ ఎన్నో రీతులు

మల్లె పొదలు సంపెంగ పూవులు

కన్నుల విందై కన్పిస్తాయి...

ఘుమ ఘుమ వాసన గుప్పిస్తాయి.

పూలవనంలో సరస్సు వున్నది
ఆమడ దూరం అంతుపట్టదు!
సముద్రానికే సాటి వచ్చును!
సరస్సులో చేపలు చిన్నవి, పెద్దవి
రంగు రంగులా రకరకాలవీ!
ఆశలు దీరా ఆహ్వానించీ...
మనసలరించీ మరపిస్తాయి.

సరస్సు మధ్యలో దిబ్బ వున్నదీ
దిబ్బన పెద్దా మర్రి వున్నదీ!
మర్రి తొర్రలో గూడు వున్నదీ
గూటిలో చక్కని పక్షి వున్నదీ
పంచ వన్నెలా కుంచె తోకదీ!
కంచు కంఠమూ కళల పక్షికీ!
పల్కులు చిల్కను పసందుగాను
ముచ్చటబెట్టీ మురిపిస్తుందీ!
కమ్మని కథలూ కల్పిస్తుందీ!
కరువు దీరగా కవ్విస్తుందీ.

చెట్టు మొదట్లో పుట్ట వున్నదీ
పుట్టన పెద్దా పాము వున్నదీ
పాము శిరానా మణి ఒకటుందీ
మణిలో గొప్పా మహత్తు వుందీ
ఏదికోరితే అది ఇస్తుందీ ...

ప్రకృతిలోనా చిత్రం బేమో!
పాముకు పక్షికి పడనే పడదు!
పక్షిని మ్రింగా పాము చూచును
పామంటే పగ, పక్షికి ఎంతో!
చెట్టు చిటారున చేరిన పక్షికి
పామంటేనే పగ లేదసలూ!
చెట్టు చెంతగల పుట్టలో పాముకు
పక్షి యన్నచో ప్రేమే ఎంతో!
పక్షీ పామూ చెంత చెంతనే
కలసీ మెలసీ కాపుర మున్నవి!
స్వార్థం, ద్వేషం సరసన లేవు!
ప్రేమా సఖ్యత పెంచుకున్నవి
అక్కల్లారా! అన్నల్లారా!
చెల్లెళ్లారా! తమ్ముళ్లారా!
అందరు కలిసీ వెళదామా?
పక్షిని చూసీ పాటలు విందాం!
అందం చూసీ ఆనందిద్దాం!!
పామును చూసీ పరీక్ష చేద్దాం!
మణినే చూసీ మహత్తు చూద్దాం
పెద్ద చదువులూ రావాలంటూ!
గొప్ప పదవులూ కావాలంటూ!
కోరికలన్నీ కోరెద్దాం!!
గొప్ప వరాలే గొనివద్దాం!
రండీ రండీ...రారండీ...
రండీ వేగమె...రారండీ...